# మల్లికార్జున శతకము

రచన

కవికులాలంకార, కవిరాజు

**శ్రీ అలంకారం కోటంరాజు**

ప్రకాశకులు:
అలంకారం సోదరులు
గాయత్రి నగర్, కందుకూరు, ప్రకాశం జిల్లా
శ్రీనివాసనగర్, ప్రొద్దుటూరు, కడపజిల్లా

# మల్లికార్జున శతకం

- శ్రీ అలంకారం కోటంరాజు

ఉ. దోసెడు నేలకై పరులతో సిగ పట్లయె, నీతిమాలి - నీ
కోసము కేలు లక్షలు నకుంఠిత భక్తిప్రపత్తి తోడ - కై
లాసనివాస! వాసవ మురారి యజా! ప్రముఖాద్యవంద్య - ఆ
యాసములేక పోసెదరు - అద్భుత మాయెను, మల్లికార్జునా! --1

చ. వలిమలయల్లు వాడవని, వాంఛితముల్ యిసుమంత లేని - వే
ల్పుల యెకిమీడు నీవయని మోక్షము నిచ్చినట్టి సా
ధులయెగల్లు వాడవని - ధూర్తుల నెల్ల నశింపజేయు న
గ్నులదరి గొల్చువాడవని - కొల్తురు నిన్నుద మల్లికార్జునా! --2

చ. ఇలుగడపంగ లోకమున నెల్లెడ యిల్లిటు బీరువోక - ఆ
వులదొరతేజిగా వెడలుచుంటివి భిక్షకు నెంత వెఱ్ఱు లీ
యిలగల మానవాళి కననింతగ వేడుట బూదితప్పు - యీ
గలయది యేది నీకడన కానగ జెప్పుము మల్లికార్జునా! --3

ఉ. సామివటంచు నిన్ను - నగజాపతి వంచును యెన్నగా మదిన్
కామహరా! ధరాస్థలిని గాంచిన కొంచెము మేలెగాని - మా
లేమిని బాపుమంచు పిను రేబవలిట్టులవేడుచుంట - నీ
కేమని పించునో! తెలియకేనిటులుంటిని మల్లికార్జునా! --4

చ. నినుదరిసింప నెంతునిను నిత్యము పూజలుసల్ప నెంతు - నిన్
మనమున నిల్ప నెంతు - స్తుతిమానక జేయగ నెంతు - కాని నీ
గొనమది యేమొ! యాలిపయి కూరిమి యంతగ బెంపనేల? మా
కును తలవంపొనర్చితివి కోపమికేలను, మల్లికార్జునా! --5

ఉ. శూలమునీదు యాయుధము - శూర నికాయములోన నెవ్వడీ
డో! లయకార! మారహర! యోద్ధవు బోద్ధవు సర్వధర్మ కా
రా! లవమెంచ బోకుమిక, రక్షకుడెవ్వడు నీవుదక్క - యా
కాలుడు డీలు పోయెను జగాన మగాడవు, మల్లికార్జునా! --6

ఉ. హైమవతీ సతీ సతము నంచిత రీతి సమాదరింప - నీ
వే మొ ! పురత్రయంబు - కనువిందుగ గాల్చుట గొప్పగాదు! ఆ
రామ సహాయ మట్టిది, సురాళి కరాంబుజముల్ మొగుడ్పగా
కేమగు నీకు శూలమున కేమగు జెప్పుము మల్లికార్జునా! --7

ఉ. ఓమినువాకతాల్ప! మహిమోన్నత చారుమనోజ్ఞ తెల్ప - నీ
వేమి యొనర్తువో! సురమునీంద్రులు సాంద్రతపస్సమాధి ని
న్నేమరకుండ దాల్చుటది యెందుకొ! మందుండ నేనెఱుంగ, నో
కామితద సిద్ధికారక! తగన్ వివరింపుము మల్లికార్జునా! --8

చ. కృపగలవాడ వందురు తరింపగ జేసెడి వాడవందురీ
త్రపను హరింపగా గలుగు దర్ప సముజ్జ్వలుండంచు నెన్నగా
నిపుడిటువింటి, కంటికొనలింతదలుగా కనుగొంటి, మంటి నీ
జపమున, నుంటి నంటుకొని, సంతస మొప్పగ మల్లికార్జునా! --9

చ. వరలెడి గాంగ, జూటమున, వన్నెల జాబిలిరేక నెత్తిపై
తరుణ భుజంగ భర్తగల తద్ఘన కంధరసీమ యింతయున్
నిరతముయాయకుండ సతి నిల్చుట నీదు శరీరమందు - నో
పురహర! గుర్తులాప్రజకు పొల్పెస గంగను మల్లికార్జునా! --10

ఉ. జ్ఞానులు, మూర్ఖ చిత్తులు, నిషాదులు సాధులు క్రోధమానసుల్
దీనులు వాద్యలందు గడిదేరిన వారలు కార్యశూరులున్
మౌనులు ధర్మవర్తనులు మందులు మాన్యులు మార్గదర్శకుల్
కానగ నీదు భక్తులట! కామహరా! ధర మల్లికార్జునా! --11

ఉ. పారములేని జీవన ప్రవాహమునంబడి పోవుచున్న సం
సారులు వీరు, సాధుజన సంగతి వీడిన వారువీరు - యే
దారియుగానరాక పలు దారులు ద్రొక్కిన వారువీరు - న
వ్వారికి దారి జూపుము కృపార్ద్రత పైకొన మల్లికార్జునా! --12

చ. తులగల వారులేరు కడుధూర్తులెగాని జగాన స్వార్థ మే
మలయుచు పెక్కురూపముల మంచిని పెంచగ నీయరైరి - యే
వెలుతురు లేదు చీకటులు వ్రేగయి క్రమ్మెను యెన్ని యెన్ని గొం
తులు నిట మూగవోమినవో! తోచునె? యేరికి మల్లికార్జునా! --13

చ. కలవనియేదలంచితిని కష్టములన్నియు జెప్పుచుంటి - నీ
వలనను నాదు బాధలు రవంతయొ! యెంతయొ! తీరునంచు - నే
తలతును మీదనీదయ కథాకళిగాగ తలంచిలో నిజం
బిలయిది యంచు నెంచితొ! గ్రహింపగ దెల్పుము మల్లికార్జునా! --14

చ. విసమును మ్రింగినాడవట వ్రేగయినన్ లెక్కసేయకన్
కసిగొని దుర్మదాంధులను కాలుని గేహము జేర్చితంట, నీ
బిసగన దార్ఢ్యమైనదియొ, భీమ పరా-కమ రాజకీయపుం
దెసనెప్పుడైన జూచితివె? దీక్షగ దెల్పుము మల్లికార్జునా! --15

చ. భసితము బూసినావు కులభామను మేనున దాల్చినావు - నీ
రసికతదెల్ప గంగను నిరంతర మింపెసలిర నెత్తిపై
మసలగ జేసినావు విషమైనను మత్తు భరించినావు - యీ
దొసగులు చాలవే? పరువు తూలగ గాలికి మల్లికార్జునా! --16

చ. ప్రణవము నుప్పతిల్లునట పాదనిబద్ధిత నూపురావళిన్
క్షణికములైన జీవన సుఖంబులకై యటులఖ్ఖు జాచి - ర
క్షణయిసుమంత లేక నటు జచ్చుటెగాని నరాళి కేది - యీ
ప్రణవము తోడ నింతయు ప్రభావితులౌదురె? మల్లికార్జునా! --17

ఉ. కాకులు గొట్టి గ్రద్దలకు కండలు బెంచెడి తంతు సాగు - యీ
లోకము జీకిచీకి పలురోతల చేతలకూతమాయె - చీ
కాకది గూర్చె చూడగ వికారము గూర్చెనుమాకు - నీకు నా
లోకన మింత గల్గద నిరోధమొనర్పవా? మల్లికార్జునా! --18

చ. వదనము సుప్రసన్నము ప్రభాత మనోజ్ఞ మరీచి మాలికా
సదనము హాసరేఖ వనజంబుల గీడ్వడ జేయు నేత్రముల్
మదన శరాళి యేల? నను మానిని చూపులకోపులోపు - సం
పదయెదొ దానినీవె! ప్రతిభారతుడయ్యేద మల్లికార్జునా! --19

చ. గదిసిన జాలునటంగద గాంగఝరీరస రమ్య మాధురుల్
పొదలిన జన్మవాసనలు పోడిమి మీరగ దీర, దారిలే
క దివము రాత్రియున్ మిగుల క్రాగితి నీదెసరా దలంచి నీ
సదన మదెచ్చటో! తెలుపు సాగెద ముందుకు మల్లికార్జునా! --20

ఉ. స్త్రీలసమానతా విభవశ్రీకిదె శ్రేయము గూర్చితంచు - నీ
వాలకమందు తళ్కులు ప్రవాహములై ప్రభవించెగాని - నా
కేలనొ విశ్వసింపగ నొకించుక సందియ మాయె కృష్ణ జ
న్మాలయ మాసతీ తిలక మార్యకు నెన్నగ మల్లికార్జునా! --21

చ. శివశివ శంకరాయభవ శ్వేత మనోజ్ఞ సువర్ణ వర్ణ - మా
నవజనపావనా! రుచిర నాట్య కళానట నాధురంధరా!
తవ పద పద్మరాజి నెదతత్పరతన్క్ష ఘటియించి నాను - మే
రువు గద నాదు పాలికి కడుంగడుచూడుము మల్లికార్జునా! --22

ఉ. రావణుడంట వానికెదురంగను ముందుకు బోవరంట - క్రొ
వ్వావహిలంగ నాడు సురవాహినికిన్ నెదురొడ్డెనంట - స
ద్భావము పూజ్యమంట రఘురామ శరాహతి మంద భార మీ
వే రహియించి తంట వినిపింపుమదెట్టిదొ మల్లికార్జునా! --23

చ. కలిగెను నామనంబు గడుకష్టము నష్టము నోర్వ లేక - నీ
వలనను నంతొ యింత యొ శుభంబును బొంద దలంచి నేను - ని
శ్చలమతి నొచు వచ్చితిని సాంద్ర దయామతి వొచు బ్రోతువో!
పలుకక నూరకుదువొ! శుభంకర శంకర మల్లికార్జునా! --24

ఉ. శంకరుడన్న భక్తులవశంకరుడందురు ఘోరవైరి - నా
శంరుడంద్రు మంచిదె! ప్రశస్తి, యటుల్వినవొట, కాని నా
శంక మతేమిలేదు మనసా నిను గొల్చెడి వారి జూడ నా
వంకకు వత్తువే? కరుణ భాసిల తెల్పుము మల్లికార్జునా! --25

చ. బిరుదు తగిల్చి కొందరు ప్రవీణుల మంచును చెప్పికొంద్రు, తా
మరలటు తంపరై సతము మాపురికిప్పుడు నెందరెందరో
పరువిడుచున్నవారు పరభాగ్యము గోరెడి చింత తప్ప భా
సురముగ నిన్నెఱుంగరు యశోధన! మేదిని మల్లికార్జునా! --26

చ. తలపుల నిల్పి నాను వసుధాతల మందున నిన్ను నిప్డె నే
కలిగిన వాని పట్టు కొన కాళ్లరుగన్ తిరుగంగ లేదు - నా
పలుకుల యందసత్యము రవంతయు జూడగ లేదు నిట్టినన్
పిలుతువొ! పిలంవో యిపుడె పేర్మి గ్రహింతును మల్లికార్జునా! --27

ఉ. ఎందరులేరు వేల్పులు మహేంద్రులు చంద్రులు భక్త కోటికిన్
కుందు నడంచు వారు యనుకోని వరాల బిరాన నిచ్చు వా
రెందరు నెందరో గలరు నిందఱిలోనను నిన్నుగోరి - నే
మందుడనైతినా? తెలుపుమా? యిక నాగతి మల్లికార్జునా! --28

ఉ. ముందుకుబోవనీకు నను, మూర్తి నెదోకననీరు నన్ను, నీ
చందమెఱుంగనీరు, మనసారగనిన్ స్తుతి యింపనీరు - యీ
మందులు పాప జాతికి సమానమె? మానవులెంతలెంతలై?
యందక నున్న వారు జగమందున నెందరు మల్లికార్జునా! --29

చ. అదికనకమ్ము వద్దది క్రియంబున నిచ్చిన యేల నాకు - నీ
పది యిది జూపనేమిటికి వాంఛలు నాయెదలేవు, మోహమా?
గదియదు నన్ను మంచి నెదగాంతును మాయకులోనుగాను, నీ
విది గ్రహియింప చాలున వివేకము జూపను మల్లికార్జునా! --30

ఉ. శాంతమహా సముద్రుడవు శాంభవి పార్వతి జోడు గూడి, య
శ్రాంతము లోకపాలన, ప్రశస్తముగానొనరింతువంట - యీ
భ్రాంతినరాళిడెందముల - భాస్వద కాంతుల నీన సాగె, మా
ప్రాంతము నందు నీ పొలుపు పాదము వెట్టదె? మల్లికార్జునా! --31

ఉ. నాగరకంపు కంపు ద్విగుణీయంబయె నిత్యము నాగలేక - యే
రోగమునో వరించితిమి - లోపమదెక్కడ సంభవించె - మి
న్నాగులు సాగి యాభువిని నాట్యము సల్పుచునున్నవిప్పు యే
త్యాగము జేసెదో! విషమెత్రావెదొ! తెల్పుము మల్లికార్జునా! --32

చ. పెదవులు గోరి కొందఱటు భిన్నమొనర్చిరి జాతి నీతినే!
పదవులుగోరి కొందరు విపన్నుల జేసిరి దేశవాసులన్
సదనము దాపుగానెపుడు సాగగ నీయకు చీడపుర్వులెం
తదయతవారి గుండియకదా! పురనాశక! మల్లికార్జునా! --33

చ. ధనమన యాశ, పాశమని దల్పరు నిల్పరు రెంతొమోహమున్
మనమను మాటయే మధురమైనదిగాదలపంగ బోరు - సా
ధనము ధనమ్ముగాదనిన దానిని యించుక తల్పబోరు - ని
ర్ధనుడగువాని పాట్లు కనరా! విన వచ్చునె? మల్లికార్జునా! --34

చ. వరదుడ వంచు నీవు గుణవంతుడ వంచు గృహాంగణాన, బం
గరుగనివంచు నెంచి పురఘస్మర విశ్వము నీదు రూపుగా
మురిసితి కొన్నాళ్లు మనమూనిన కోరిక తోడ ముందుకున్
యరుగగ నుద్యమించితిని యార్తిని గుందితి మల్లికార్జునా! --35

చ. తినుటయు త్రాగు చుండుట యుత్ప్తి యొసంగును మానవాళికిన్
మనుటయు నందుకే ధరసమత్వముగోరుట యందు కందుకే
పనులను జేయుటందలకె, ప్రజ్ఞను జూపుట యందుకే, మఱే
ది, నరులకాత్మకింపయిన తృప్తి నొసంగడు మల్లికార్జునా! --36

ఉ. దూరము బోకు వచ్చితిని దోచితి వెప్పుడొ నన్ను నీవు - సా
ధారణమైన పద్ధతి, నితాంతము సాగెద వంచు నెంచి, యీ
దారికి వచ్చినాను, పలుదారులవాడవటంచు నెర్గి, నే
నీరయి పోయి నాడను గణింపుము ప్రార్థన మల్లికార్జునా! --37

ఉ. గంపెడు కాపురమ్ము పలుకాయలు గాసెను మోసిమోసి, యా
కొంపయటన్న వెక్కసము, కోమలి నందుకె వీడినాను, యీ
రొంపి జొఱంగలేను, కడురోసితి బాసితి నిన్నుగానగా
తెంపున వచ్చినాను నిజదీప్తులెసంగుము మల్లికార్జునా! --38

ఉ. ఒక్కప్రదీప్తమూర్తివయి యొక్కమహానల జ్వాలవౌచు - ఆ
చుక్కలనిక్కినావు కడుచోద్యము గారహియించి నావు - నీ
వెక్కడ దిక్కులెక్కడ మహేశ్వర మాదగు దిక్కు జూడవా?
దిక్కవునీవటంచు పరిదేవన జేయుదు మల్లికార్జునా! --39

ఉ. తెక్కలు విప్పి యాకసమదెంతని దూకుదు పక్షిపోల్కి, కెం
పెక్కిన కన్నుదోయి కనిపింపగ గర్జిలు వ్యాఘ్రభంగి, కై
పెక్కిన త్రాగుబోతు చరియించెడి తీరున, తీరులేక, క్రొ
వ్వెక్కిచరించునన్ను గడువ్రేగయి చూతువె? మల్లికార్జునా! --40

చ. నిజమిది గాదటంచనగ నెందఱొ వింటిని కాని యేది? యా
నిజమిది యంచు జెప్పెడి మనీషులు లేరెనరిందు నందు - యీ
ప్రజలను నమ్మలేను, పడిపంచల నింతయు నిల్వ లేను - సా
సామజమటు నామరమ్మిది, యు మాధవ బోవర మల్లికార్జునా! --41

ఉ. జూదమొ! పానమో! యిహము జూపిన దారిని బట్టి పోవుటో!
ఏదొ! యదేవిధంబుగను, యీజీవితమెల్లబోయె రా
వా! దయ జూడవా! పోడము వాంఛల నెల్లడంపలేను? నా
కేదొ విధిన్ సహాయము నొకించుక జేయవ? మల్లికార్జునా! --42

చ. వినుతగుణాఢ్య! యాఢ్యనుత వీను విందొనరించు నీకథల్
కనుటకు నెట్టులుండునొ! యెకాయెకి స్వర్ణగిరీంద్ర మెక్కగా
ను నెనరు జూపుదో! శుభగుణుండవు? వర్ణన సేయజాల, మే
లును నికనైన జూపుము విరోధము వీడుము మల్లికార్జునా! --43

ఉ. కంపముబుట్టె దేహమున కాంతల పొందనినంత, సుంత ర
రప్పింపుము లోని మోహమును విత్తుము చిత్తము నందు భక్తి నీ
కింపగు నట్లు జేసి పరికింపగ నిద్ది శుభోదయంబు, నై
లింపనుతా! గ్రహింపవె? చలింపని బుద్ధిని మల్లికార్జునా! --44

ఉ. శీలము చీలిపోయిపది, చేతలు నీతిని మ్రింగె వైచె, నే
గాలికినైన నిప్పుడిక గట్టిగ బట్టగలాడ చాప నే
లీలలనైన జేయగల, లేవడి కర్కశ పాదఘట్టనన్
వ్రీలె, దయా విభూతి ప్రసరింపుము మన్నుము మల్లికార్జునా! --45

ఉ. పుట్టెడు కోరికల్ తలపు పుట్టన పుట్టెను, నిద్రపట్ట ది
ప్పట్టున వాని దీర్పమని బట్టితి నీపద పద్మయుగ్మమున్
ఎట్టని బుట్ట దాఖల సహింపని యట్టులొనర్తువో! సరే
యట్టులె యంచు జేసెదవొ? తెల్ల మొనర్పుము మల్లికార్జునా! --46

చ. కడలను నిల్తు వేల కలకాలము నిట్టులె సాగునంచు - నీ
యెడద దలంప బోకుము, గ్రహింపుము మూర్ఖులుగారులే ప్రజల్
నడతలె యెల్లవారికిని నాణ్యమొ సంగును, నీవె చెప్పు, మీ
బుడిబుడి మాటలన్ వినరు, బ్రోవగ రమ్మిక మల్లికార్జునా! --47

చ. నినుమన మార, మారహర! నిత్యము సంస్మరణంబు జేసెదన్
గొనముల కిక్క వంచును నకుంఠిత భక్తి ప్రపత్తి పత్రిగా
గొని నిను బూజసేసితిని కూర్తువటంచును, రిక్తహస్తమే
కనుమని జూపి నావు సితకంధర కుందగ మల్లికార్జునా! --48

చ. విరిసెతమమ్ము నాకిట వివేకము గల్గెను నిన్ను జూడకన్
పరచెను పాపముల్ యిపుడె బంధుర సింధుర సంఘమట్లు, యీ
వరకె పుట్టి తృప్తి మదిభాసిల లేదు, నిజమ్ము సుమ్ము, నీ
వరసిటు మార్పు జెందుట భవా! కవగూడెను మల్లికార్జునా! --49

చ. విలువలుబెంచి మానవత వీధులలో బడకుండ జేసి, లో
పల బయటలందు నెందునను, భాసురహాసకపోలు నిన్ను నా
పలుకుల నిల్పి తల్పున, శుభాస్పద! పాదయుగంబు నేను - పూ
జలదనియింపగా దలచి సాగితి నాగక మల్లికార్జునా! --50

ఉ. పారములేని యీభువన భారము వారము వారమంతయున్
చారు మనోజ్ఞ సుందర! విచారము నొంచక గాజు వారకన్
సిరభుజా విదగ్ధమటు సాగక నాగకరేగ, వీగకన్
తీరము జేర్పగా వెనుక తీయవు మాయగ మల్లికార్జునా! --51

ఉ. ఏనునెఱుంగుదున్ మధువుకీవునిధానమటంచు, నెంతయున్
పానమొనర్చినన్ తఱగు బోవునె సుంత, విచిత్రమేమియో!
కానను, గానమందున జగాజిగు లొల్కు కవిత్వమందు, లో
నూనురస: ప్రవాహములు నూల్కొనెనేమొకొ! మల్లికార్జునా! --52

చ. అదిపరిదేవనా విలసనానలమై వెలుగొందె చూడు - యి
య్యది పలువేదనా నిలయమై పెను పొందెను జూడు నేడు - నీ
దిని యదోయిదో యెదియొ! మారహరా! వేలగుండు వెట్టె - వే
డెద నిను, మౌనమున్ విడిచి డెందము విప్పుము మల్లికార్జునా! --53

ఉ. రాతిరియున్ పవల్ ధనమురా ప్రతివాడు దలంచుగాని- యే
భాతి యతండు దాని సముపార్జన జేయనెఱుంగలేక - నీ
జాతికి నెగ్గుకల్గునటు సాగును నాగడు దేశద్రోహియౌ
హేతువు నీధనంబెగ్రహియింపరు వీరలు మల్లికార్జునా! --54

ఉ. అర్థమనర్థమంచు జనులందరు సందడిగాగ గూడి - భా
వ్యర్థము విప్పి జెప్పెదమ బంధుర వాజ్నిపుణంబుడంబుమె
వ్యర్థములైన పల్కులవి పాపి ధనంబునకై జగాన పె
న్నార్థవహించి నిత్యమిటుచత్తురు చూడుము మల్లికార్జునా! --55

ఉ. లోకము కాకి సంత, యవలోకన జేసిన కానిపించు, నే
పాకమొనర్చినన్ రుధిర పానము మానరు, హింస యొక్కటే
నాకని పించు నట్టి సుగుణంబని దాపతీకంబదేల? లో
బ్రాకెడు వేదనల్ ప్రధిత బంధురమైనవి మల్లికార్జునా! --56

చ. విమల పయఃప్రవాహములు వేడ్క జనింప జేయుచుండు - నీ
యమలిన వాక్సుధారసచయంబు విడంబము జూపుచుండు - తో
రముగను శస్త సంపదలు రాజిలు చుండును నీ తలంపు చం
దము భువి సత్కవిత్వమును నాటిన నాడిల మల్లికార్జునా! --57

ఉ. ఏలెడి వాడవీవని రహించెన మించిన సంబరాన, దే
వాలయ ప్రాంగణాన వినయంబున నిన్ స్తుతియించునట్టి - యీ
బేలనరాళి కన్గొనవ? ప్రేమర సంబొలికింపలేవ? యో
శూలి! నిజప్రభావమును జూపగ రావొకొ! మల్లికార్జునా! --58

చ. పనివడి వచ్చువారు, పనిబాటలు లేకయెవచ్చువారు, నిన్
కనటకు వచ్చువారు, బ్రతుకర్పణ సేయగ వచ్చువారు, నీ
వని వినివచ్చువారు, కడుభక్తిని గొల్వగ వచ్చువారు, తృ
ప్తిని గన వచ్చువారు, కనిపింతురు నీకడ మల్లికార్జునా! --59

చ. నలుపనుకోదు గొంతుకడ, నాగరకంబదిలేకయున్న లో
దలపదు, నిర్ధనత్వమది తల్పదు బిచ్చపుగంజి యంచు లో
గలగదు, రుద్రభూమి కడ కాపురమంచును నెంచిలోన చిం
తిలదు, ప్రసన్నతాబ్జముఖి నీసతి దుర్లభ! మల్లికార్జునా! --60

చ. అతడు పృథాతనూజుడు భయంకరుడార్తజనావనుండు, సు
వ్రతుడయియున్నవాడు, మదిపాశుపతంబును గోరువాడు, స
న్మతిని భజించువాడు నిను, మారహరా! కరుణాంతరంగమే?
వెతలను బెట్టకుండ కనిపించిన వాడవె? మల్లికార్జునా! --61

ఉ. రిక్తులుడారు యెవ్వరు భరింతువు వారల వారి నొవ్వులన్
భక్తవశంకరుండనెడి వాసి వహించిన వాడవీవు, దో
శ్శక్తిగలట్టి భీముడవు సత్కరుణాభరణైక శీలి వ
వేకము నీదులీలలు శుభంకర శంకర! మల్లికార్జునా! --62

ఉ. ఓశివ! శంకరా! భవ! హరోజ్జ్వలదీప్త ప్రభా! నిభా! శుభా!
ఓశితకంధరా! పరమయోగి నతా! రతిరాజనాశ! సా
రాశయ! శైలవాస! చతురానన వంద్య! రుజావిదూర! ఆ
కాశనదీజటా! వరద! కాంచుము యించుర మల్లికార్జునా! --63

ఉ. నాదను కోను యేది ప్రతినాదము నీదనుకొందు, నేదినిన్
కాదని చేయబోను, వెత వాదను నీకయి యెట్టి చేతకున్
వాదనలేల నీయసమ వింఛలు నాకిక నేల నీవు కా
దా? దయజూడగావలయు దాతవు త్రాతవు మల్లికార్జునా! --64

చ. రసమయమూర్తివీవు రస రాజ్య ప్రవర్తితస్ఫూర్తినీవు, ఆ
యసమ శరాసనుండు, మసియాయెను మాయగ రాజశేఖరా!
అసమప్రదీప్త నేత్ర రుచిరానలజ్వాలల దుర్మదాంధులన్
మసియొనరింప రమ్మికను మాధవ! కావగ మల్లికార్జునా! --65

ఉ. కాలుని దున్నపోతు మెడగంటల చప్పుడు సోకునాడు, నో
శూలధరా! తలంపునకు సోకుదువేమొ! నియంతలౌచు, మో
హాలయమైన ధాత్రినిటు హాయని హాయిగ గుల్కుచుండు, మే
మేలను కేలుమోడ్తుము గ్రహింపవె నైజము మల్లికార్జునా! --66

చ. కలగము వేయి హత్యలకు కందము లోకప్రపీడనమ్మికై
చలనము లేని రాళ్లము విచారమెఱుంగని మొండివారమీ
యిల తిరుగాడు చుంటిమి వరించిన యీ పెనుకల్మి బల్మి శ్రీ
వెలయగ జీవితాలు కనువిందగునే ధర మల్లికార్జునా! --67

ఉ. నీవను కొందువో మదిని నీవనుకోవొ! యదేమొ యేమొ! నా
భావములోన నిట్టిదని బంధుర ఫక్కివచించినాను, రా
వే! యొరలోని ఖడ్గమును వేగమెదీయుము, సంఘదౌష్ట్యమున్
నీవిక చెండుమా? తలలు నిక్కగ నీయక మల్లికార్జునా! --68

ఉ. తాళను నీదుయాజ్ఞ తలదాల్పగలేను యదార్థమైనచో
చాలును మ్రొక్కులిత్తును రసార్ణవమందున దేలియాడుదున్
ఫాలవిరూపలోచన! కృపాగుణ! కారణ! మారమారణా!
కాలగళా! శుభంబులను కంపమతిన్గడు మల్లికార్జునా! --69

ఉ. తాళుము తప్పు పట్టకుము ధర్మనిబద్ధ ప్రబుద్ధ బుద్ధితో
నేలుము విశ్వమంతటిని యేనును నీపదపద్మసేవలో
పాలు సగంబు పంచుకొని పావనతన్ ఘటియింతు నేలయా
గోల యికన్నిడంపు తరుగున్ కద భారము మల్లికార్జునా! --70

ఉ. సారదయా విభూతి కయి సాగిలుచున్ బడువారు నీపయిన్
భారమువేయువారు, జనబాంధవయంచనువారు, యార్తితో
రార పరీక్ష సేయకుము రాయనువారు గలారు ధాత్రిలో
వారిని కాచి ప్రోవ వలె వాసవ పూజిత మల్లికార్జునా! --71

చ. పసరము నెక్కి నావు, నెలబాలునినెత్తిన నిల్పినావు, సా
రస ముఖి పార్వతీసతి నిసాముగ మేన ధరించినావు - పెన్
విసమును మ్రింగినావు, వనవీధులు గ్రాలచరించినావు, నా
రసముల జంపినావు త్రిపురాసుర వర్గము, మల్లికార్జునా! --72

ఉ. ఎన్నిమదావళంబులు నికెన్ని యొసైంధవరాజి గల్గ - నీ
వెన్నితివేల? నీ వృషభమెందొకొ గడికడతొ తృప్తి జెందు నం
చన్నయ భీష్టమేదొ! మనమందున నెక్కనియుండెనేమొ! కా
కున్నయదెట్లు వాహనమొకో, కనుగొన్నను మల్లికార్జునా! --73

చ. వసనము నేన్గుతోలు నిజవాసము నౌర! శ్మశానవాటి, యౌ
రసులగు పుత్రులేరి; గిరిరాట్సుత పాపము నిన్నుగోరి, నీ
రసపడిపోయె, కుందుచు నిరంతరమెంతగ జూడుజూడు- మి
ప్పు సగము నాయె రేపటికి పొల్పొటులుండునొ! మల్లికార్జునా! --74

చ. మధుర మనోహరాకృతివి మంజుల సత్రుణ వామృతంబు సా
రుధునివి, నమ్మువారి కను రూపముగాక కడు మేలొనర్చు వా
రిధివి, విభుత్వ మొప్ప ధరిత్రిని పాలన జేయునట్టి - సా
రథివి, గదా! యెఱుంగరె మురారి బలారులు మల్లికార్జునా! --75

చ. హరుడవు శంకరుండవు మహాత్ముడ వన్యులు దాటలేని - సా
గరుడవు వెండి కొండ పయి కాపురముండెడి వాడ వీవు - మా
ధురులెదపంచువాడవు - ప్రదాతవు శీతనగాత్మ జాత సుం
దరవదనారవింద మధువానెడి తేటివి మల్లికార్జునా! --76

చ. అమృతము ద్రావినట్లు, పరమాన్నము నింత భుజించినట్లు, క్షే
త్రములను జూచినట్లు పలుధాటిగ దీటుగ వేదశాస్త్ర మం
తముగని నట్లు గాంగఝరి దగ్గఱకేగినయట్లు, నీదు నా
మము యజపియించు నప్డు మనమందనిపించును మల్లికార్జునా! --77

ఉ. నీవు నగాత్మజాతయును నెమ్మి దలిర్ప భూతధాత్రి - పెం
పావహిలంగ సాకుటను ప్రాణులు ప్రాణము తోడనిల్పె - కా
నీ! వసుధాతలానను జనింపవు నింపవు పెంపు జూపు పల్
తావులుగుల్కలేవు యిది తత్త్వము వానిది మల్లికార్జునా! --78

చ. వరదుడవన్న నీవెగ, యపర్ణ మనోభవుడన్న నీవె - భా
సురకి చర్మధారి వయి శోభిలు వాడవటన్న నీవె - ఆ
సురయసురాళికిన్ హితవచోన్నతి మోము గూర్తువె, పా
దురధరకీవు, ధూర్తజన దూర శుభాస్పద మల్లికార్జునా! --79

ఉ. సారధి బ్రహ్మయంట నవ సారస నేత్రుడు బాణమంట - భూ
మే, రథమంట వేదములమేయ మహాశ్వములంట, జూడ నీ
వేరధి వంట, గాల్పవె తపింప పురత్రయి సూర్యచంద్రులే
కారణమెట్లు చక్రములుగా పడి మారిన మల్లికార్జునా! --80

చ. హరిహరులొక్కరందురు మహామునులందరు, తిక్కయజ్వయున్
సరియనె భారతంబున రసార్ణవముల్ గద తత్కధాసుధల్
గురిగొని జూచితేని? పలుకుల్ సరిగావిట దేవళాలు - చూ
డరయగ నెన్నొ వెన్నుని పొడారెను నింతకు మల్లికార్జునా! --81

ఉ. చాలిన వాడవందురు, ప్రసన్నుడ వందురు నిన్ను జూచి, పెన్
జాలికి నిక్కవందురు, ప్రజాళికి నచ్చిన వాడ వందురీ
గాలిటు తగ్గకుండగ జగాన యొనర్పుము లేనిపోని - వా
చాలతచూపబోకు విరసంబగు నెంతకు మల్లికార్జునా! --82

ఉ. ఎద్దట, వాహనంబు, యది యెంతటిదో గద పుణ్యమూర్తి, యా
పద్దశదాటి, ధన్యత సుపర్వులు మెచ్చగ గాంచె, లేనిచో
ప్రొద్దుటనుండి రేయి యిట పోడిమి జూపెడిదాక కాడిపై
రుద్దుట తగునే? యిహము రోయగ దానికి మల్లికార్జునా! --83

ఉ. ఎంతసమగ్ర కాంతియది యెంతటి యెంతటిభ్రాంతియైన - నీ
పొంత వసింపపోవుగద పోల్ప, నెవండగు నీడు నీకు - వి
భ్రాంతము నీదు చెయ్దము ప్రభాత మనోజ్ఞ ప్రశాంత శాంతసం
క్రాంతముఖాబ్జ మట్టిది జగంబు రహింపగ మల్లికార్జునా! --84

చ. పలుకుల తీపి మాపయి ప్రభావము జూపడు - జూపెనేని - యెం
తలు, నిసుమంత యాకతలు తల్పగ కాలము చెల్లె, మంచి చే
తలు యవి కొన్నియైనను యదార్థముగా పచరింతువేని, కొ
మ్ములుగలవాడ వందురు, ప్రభూ! నిను ధాత్రిని మల్లికార్జునా! --85

చ. సురగరుడోరగాళియు వసుంధర గల్గు జనాళి యెల్లయున్
శిరములువంచి నిల్చెను వచింనగ లేని మహాచ్ప భక్తి నీ
చరణరజంబు వారి పయిచల్లగ సోకిన చాలు మేలుగాం
తురుగద చూడుమా! కనులతోడను మూయక మల్లికార్జునా! --86

ఉ. ఏనిక మోమువాడొకడు నెంచగ షణ్ముఖుడైనవాడు - నీ
ప్రాసమానులౌ సుతులు వహ్వ! భళాభళి! మేముకాద? లో
కానయిదేటి భేదము, నగాత్మజకీ విషయంబు దెల్ప నే
మౌనొ! మహాత్మ! ఆత్మగలదా? వరదాయివె? మల్లికార్జునా! --87

ఉ. పాపము పండినప్పుడు ప్రపంచము పొంచిన మిత్తి నోటికిన్
పాపము! చిక్కునంట మఱీ పాపులొ పుణ్యులొ యెవ్వరెవ్వరో!
రూపఱీ పోవుటల్ నిజము రూక్షవిలోకనమాని చూడు సం
తాపము నొందు చేతయిది తథ్యము మాన్పుము మల్లికార్జునా! --88

ఉ. కోయిల గొంతులో గలవు కోవెలలో గలవెందు జూడ, నో
హోయన హోయటందువు, యయోమయ యాయెను, మాయగాను, భ
వ్యాయ! నమశ్శివాయ! భవబంధ విమోచన సేయరావ, మా
ధ్యేయమదే కదా! యరుగు దేరుము తీర్పగ మల్లికార్జునా! --89

చ. అణువులు జీల్చినారు, పరమాణువులన్ కనిపెట్టినారు. దా
రుణములు జేసినారు, నెనరూనగ నెప్పుగొ మానినారు, మా
రణముల కొగ్గినారు, పరరాజ్యములన్ కబళించినారు, కా
రణములవేవొ తెల్పుము - హరా! రజతాచల మల్లికార్జునా! --90

ఉ. మల్లెలు పూచినట్లు జనమందరు హాయి భజించినట్లు - సం
ఫుల్ల మనోజ్ఞనే-తరుచిబూనిన చూపులతోడ నీవు మ
మ్మెల్లర జూచినట్లు విజయేందిర చేతికి నంది నట్లు, సం
ధిల్లె స్వప్నముల్ చెఱగ నీయగ జేయకు మల్లికార్జునా! --91

చ. ఇది మధురోహగావలెను యియ్యది తియ్యని పాటగావలెన్
ఇది యనుభూతిగావలెను, యియ్యది యంచిత భక్తిగావలెన్
ఇది సుమశయ్యగావలెను, యియ్యది భాసుర రోచిగావలెన్
ఇది రసరమ్యగావలెను, యియ్యది నెయ్యము మల్లికార్జునా! --92

ఉ. దారులు వేఱు, వారి సరదాలవి వేఱు జగాన గానగా
బారులు దీఱినట్టి పరభాగ్యము నందుట కఱ్ఱుజాచు. య
వ్వారల తీరు వేఱు, తమవారలనైనను మోసగించు, దు
ర్వారులు, దుష్టబుద్ధులు, భవా! నవమూర్తులు మల్లికార్జునా! --93

చ. సిరికయి స్త్రీకినై, నరులు చింతిలు చుందురు, లభ్యమైన, నో
హర! సరిలేరు, మాకనుచు హాయిని మేయుచు నిన్నుదల్పబో
రు రసము చిప్పిలంగని కడుగడు లోభవశంవదులౌచు, కా
వర! దరిలేని వారయిరి, వాసవ వందిత మల్లికార్జునా! --94

చ. కవితలనల్లినారు బ్రతుకంతయు నంతయు నీదు సేవలో
దివమును రాత్రియున్ భవదధీనముదగ్రత జేసినారు, మా
నవతకు భక్తిభావము సనాతనవైఖరి గూర్చి నారు, చే
డవ నరజాతి చేతులు, విడన్ సరిగాదు మల్లికార్జునా! --95

ఉ. తాడును బొంగరమ్ము తమదగ్గఱ లేవనుకోరువారు - యె
వ్వాడిల తారసిల్లునొ ప్రభాతము నందునె వానిబట్టి - యా
త్రాడును బొంగరమ్మును తటాలున తారెగ్రహింత్రువారు, మా
వీడొకటేల? కల్గుదురు వింతగ నన్నిట మల్లికార్జునా! --96

చ. అతుకుల బొంతలీబ్రతుకులన్నియు నిత్యము పొట్టకూటికై
వెతలనునెన్నొ బన్నములు వ్రేగయినన్ భరియించి, కన్న సం
తతినిలసాకుటే! పరమధర్మముగా తలపోయుమాకు, నీ
కతలతొనే పనుల్ యగునొ కానము ధారుణి మల్లికార్జునా! --97

చ. కరుణ యొకింతలేని కలికాలములో నెవడెట్టులుండునో
ధరనుగణింపలేము వ్యవధానము జిక్కినచాలు తోకలే
తిరిగిటు మేకులై యెడదతీవ్రగతిన్ దిగి పోవు, చూడుమా
హర! యికనేమి చూచికొని హాయిగ నుందుము మల్లికార్జునా! --98

చ. సురతరువౌదువో తనుకుజూపెడి మోదుగు మ్రాకువౌదువో!
వరవడి నీదె యీభువిని వహ్ని రగిల్చెదో! వృష్టి సుష్టుగా
కురియగ జేతువో! యభవ కూర్పరి నేర్పరి వీవెగాన, మా
కరకమలాలు మోడ్చెదము కావుము సత్కృప మల్లికార్జునా! --99

చ. పురుగుల యట్లు యీనరులు పుట్టిరి వీరితలంపులందు వై
తరుణులు వెన్ని యెన్ని బలితంబుగ పుట్టెటు పారుచుండెనో!
తరుణ శశాంకఫాల! యతిదారుణ మారణ హోమరాజి, స
ద్గురులటువే వెలార్చెదరు క్రూరులు వీరలు మల్లికార్జునా! --100

ఉ. ఈవు పురాణ పూరుషుడ వీవు త్రిమూర్తులలోన నాద్యుడౌ
ఈవు జగన్నియంతవు మహేశ్వరమూర్తివి నీవు మాకు, నె
త్తావుల గూర్తువో! బ్రతుకు దారుల మల్లెలపూయ జేతువో!
కావున కావరమ్ముయను కంపము తోడను మల్లికార్జునా! --101

ఉ. పాలనుముంచెదో! కరుణ భాసిల నల్ల సురారుగాంబు జం
బాలము నందు ముంచెదొ శివా! నవమోహనభాసురాంగ! నీ
వాలక మేదొ! మాకు తెలుపందగు నంతగ నాన్పబోకు! నీ
వా! లయ కారకుండవు ప్రభావము జూపకు మల్లికార్జునా! --102

ఉ. మానితమూర్తివై పరమ మౌనుల మానసవీధి పాయకన్
జ్ఞానము నిచ్చు దైవతమ! జ్ఞాతుల గెల్వగ నింద్ర సూతి కే
జ్ఞానము డుల్చి పాశుపతసాయక మిచ్చిన మేటి వేల్పు! మే
మానగజ్ఞాన సింధువు దయామతి నీగదె! మల్లికార్జునా! --103

చ. ఎవరిని లెక్కసేయను మహేశ్వర నీచరణాబ్జయుగ్మముల్
దవిలి చరింతు, నెంత శతధా గతి నీవని మోకరింతు, వా
చవులవి యూరనీగుణ విశాలత నెన్నుచునుందు, మందుడన్
రవిశశి వహ్నినేత్ర! నగరాట్సుత వల్లభ! మల్లికార్జునా! --104

చ. అలసితి జీవితాన హర! యాత్మనివేదన జేసినాను, నీ
వలనగు కులమేలదేదొ! నయవంచన సేయక జేయరాదె! నీ
వలనను నేదికాద! యదెవాకొను నీకనుమాన మేల? శ్రీ
గలిగిన వాడనా? తిరిపెగాడను నీవలె మల్లికార్జునా! --105

ఉ. పాలను బోసినన్ విషముబాయక గ్రక్కెడి పాపజాతికిన్
ఏలను నెందునన్ జగతి నెప్పుడు వెన్కకుదీయబోరు యీ
పాలసులైన మానవులు పల్వలు చిల్వలు కొల్వనందు నిం
తేలను దూరదూరముగ నిల్పుము పొల్పుగ మల్లికార్జునా! --106

చ. కవినయి నానొగానొ! విషకంధర రాజితశైలమందిరా!
భవమును పారద్రోలుటను భావన బంధురమై మనంబుబునన్
కవినయినాను, చంపకముఖంబున సంస్తుతి కొంత జేసి, నే
నవి మతికొన్ని యుత్పల వనంబున జొచ్చితి మల్లికార్జునా! --107

ఉ. సారము లేని దీనిని రసార్ణవ మంచును యెంచినాను, యీ
ఘోరతమ: ప్రవాహమునకున్దురీదగ శక్తిలేక - నే
నీరుచిరంపు భక్తియను నిట్టి ప్రసిద్ధపుయాన పాత్రికీ
తీరున బట్టు కొంటిని సతీశ! నినుంగన మల్లికార్జునా! --108

ఉ. శ్రీనగరాట్కుమారికి నిరీక్షణ తీక్షణ జేయకుండ - స
న్మానపురస్సరంబుగ మనంబున ప్రేముడి మీరజేరి, య
బ్జానను గౌగలించు, సుమసాయకు నొంచిన యోద్ధనెట్లు నా
లోనను నిల్పి కొందును కడంగడు దెల్పుము మల్లికార్జునా! --109

రచనా కాలం 19. 08. 1987 నుండి 25.08.1987

ప్రదేశం : కొండముడుసుపాళెము.

